


శ్రీరామశ్శరణం మమ.

# శ్రీ మద్రామచంద్రప్రభు శతకము.

గ్రంథకర్త,

కోన రాఘవయ్య,

పెంటపాడు.





పబ్లిషరు,

కోన వసమురాజు,

పాలకొల్లు.

ఇయ్యది

పాలకొల్లు రాజరత్న ముద్రాక్షరశాల యందు

ముద్రించి ప్రకటింపబడియె.

మొదటి కూర్పు 1000 ప్రతులు.



1935.

శ్రీ రామశ్శరణం మమ

# పీఠిక.

మహాశయులారా! శ్రీ రామ భక్తాగ్రగణ్యులారా!

లోకమున మానవజన్మ మెత్తుట భగవంతుని సంతృప్తి పఱచి, యాయన యనుగ్రహమువలనఁ నైహికాముష్మిక సౌఖ్యముల వడయుట కనియే యని పురాణములు మొదలగు వాక్ప్రపంచములచేఁ దెలుసుకొనుచున్నారము. ప్రకృతమునందీ కలికాలమునమనో నిశ్చయముఁ గలుగఁజేసుకొని యాభగవంతుని సాన్నిధ్యపఱచుకొని పూజించుటకడుదుర్లభము గావున "శ్లో॥ యేన కేనాప్యుపాయేన, యస్యకస్యాపిదేహినః। సంతోషం జనయేత్ ప్రాజ్ఞస్తదేవేశ్వరపూజనం" అనునట్లీ ప్రపంచ జనులఁ నాయీశ్వరునిగ భావించి యేదేని యొక విధముగ వారలను సంతోషపరచుటయే యీశ్వరారాధనమనియు ప్రజలందరినేకవిధమున సంతోషింపఁజేయుటకు, భగవన్నుతి, దక్కఁ నితరము లేదనియు సర్వమతములవారికిని పండితులు మొదలు పామరులవరకుఁ నేదేవుని భజియించిన సంతృప్తి గలుగునోయనియుఁ నీకవీంద్రుఁడప్పుడప్పుడు యోచించుచుండెను. గాని యొకప్పుడు తనకు సంభవించిన స్ఫోటకబాధఁ చేనొడలెఱుంగని పరిస్థితియందు, సర్వలోక శరణ్యుఁడును "శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ। తవాస్మీతియాచతే। అభయం సర్వభూతేభ్యో। దదామ్యేతద్వ్రతంమమ॥" యని ప్రతిజ్ఞఁజేసిన దీనజనావన నిరతుండగు శ్రీ రామచంద్ర మహాప్రభువారు తనచిత్తమున సాక్షాత్కరింపఁ నీశతకముఁ నాశుధారచే జెప్పుచుండఁ నాప్తులు కొందరు కొన్ని పద్యములను మాత్రము వ్రా

యగలిగిరఁట. శ్రీ రాముని దయచేఁ నాదారుణామయము నివర్తిం
చిన పిమ్మటఁ నీ కవిగారచ్చటచ్చట మరికొన్నిఁ పద్దెముల బొందుప
ఱచి పూర్వపు బద్దెములతో మేళవించి నూట యరువది యేడు ప
ద్దెములతో సీశతకముఁ బూర్తిఁగావించి యాతాయాతరీతిఁగా దర్శన
మిచ్చి నాకు శ్రుతపఱచిరి.

అంతటఁనాకృతి పతియగు శ్రీమద్రామచంద్ర మహాప్రభువువారి
యనుగ్రహావశమున నేను నాస్వకీయ ముద్రణాలయము నందు
గ్రంథముఁ నచ్చొత్తించి వెల్లడించెదఁనని యీ కవిగారి
కిశ్రుతపరచి గ్రంథముఁ గైకొని నాయథాశక్తి ముద్రించి పాఠక
మహాశయులగు శ్రీరామ భక్తాగ్రేసరుల కందఁ జేయఁగలిగితిని.
యిఁక నిట్లే యీకవివర్యునిచే బయలువెడలిన శ్రీ మదాంధ్ర శివ
మహాపురాణము మొదలగు పదునైదు గ్రంథములను వెల్లడింపవల
యునని యుత్సాహ పూరితుఁడనై యున్నాఁడను. రసికులును, విద్వాం
సులును, గవులును, విమర్శకులును, ధనికులుఁనగు శ్రీరామ భ
క్తాగ్రగణ్యులెల్లరుఁ నాయీయుద్యమమున సర్వవిధములఁ బాల్గొని
నాసంకల్పమును నెరవేర్చి శ్రీ రామచంద్రానుగ్రహ పాత్రులగు
దురుగాకయని మిక్కిలిఁ బ్రార్థించుచున్నాఁడను.

పాలకొల్లు,
17-7-35.

ఇట్లు విధేయుడు,
కోన వనమరాజు.



# శ్రీమద్రామచంద్రప్రభుశతకము.



శ్రీరామాయ నమో రఘూద్వహ విభో! ♦ సీతామనోవల్లభ।
స్మేరామేయ వికాస వక్త్ర జలజ ♦ శ్రీభక్త చింతామణే।
శౌరే త్వాం ప్రణతోఽస్మి నిత్య'మనుచున్ ♦ సద్భక్తి సేవించునం।
సారాత్ముల్ సఫలీకృతార్థులిల శ్రీ ♦ మద్రామచంద్ర ప్రభూ॥ ౧

శా॥ శ్రీయోషామణియైన భూమిసుతతో ♦ శేషాంశ సౌమిత్రితో।
దోయిన్ దోయక కొల్చుచుండు భరత శ ♦ త్రుఘ్నానుజన్మాళితో।
వాయుప్రోద్భవుఁ డంజనాతనయుఁడై ♦ వల్యాప్తిఁ దేలించునో
మాయామానుష విగ్రహుండవగు శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ॥ ౨

శా॥ శ్రీదంబుల్ నిగమాంతవేదితము ల ♦ ర్థివ్రాతకల్పంబు లా।
హ్లాదాత్మానుగుణానుమోదములు మో ♦ హాధ్వాంత విధ్వంసనో
గ్రాదిత్య ప్రభ లజ్ఞ జాడ్యమరపు ♦ జ్యాగూఢముల్ మోక్షసో।
న్మాదోదారములౌఁ ద్వదంఘ్రులౌఁగ శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ ౩

మ॥ స్మరియింతున్ నిరతంబు నీవిమల నా ♦ మంబే నే దేవా! ప్రపం।
చరతిన్ బాయనివాఁడ, ఖేదపు, కటా, ♦ స్వాంతంబుఁ గామాది భీ।

కరశతుప్రకరంబు, లీయఘములన్ ♦ ఖండించి నన్నేలఁనే ।
మరకోభక్తవిగేయ! ఘూతభయ! శ్రీ మద్రామచంద్ర ప్రభూ॥ ౪

శా॥ నానాజన్మ పరంపరల్ గవిసి, వి ♦ న్నాణంబు వోనాడి, స ।
త్యానూనంబగు మోక్ష లక్ష్మికిఁగడున్ ♦ దవ్వైన సంసార సం ।
తాన వ్యాధివి పీడితాత్మునకుఁద్వ ♦ త్కళ్యాణ రూపంబు, స ।
న్మానాత్మన్ దరిసించు ఔషధము, శ్రీ ♦ మద్ రామచంద్ర ప్రభూ॥ ౫

మ॥ మలయంగా, రసనాగ్రమందెపుడు యు ♦ ష్మద్దివ్యనామాక్షరం ।
బులఁబాటించి జపించుతన్ భవభయం ♦ బుల్ దీఱుఁజేకూఱుసి ।
స్తుల సౌభాగ్యవితాన మెల్లయెడలన్ ♦ దోతెంచుఁ గైవల్య భా
మ! లసన్మౌక్తికధామ! భద్రగిరి శ్రీ ♦ మద్ రామచంద్రప్రభూ ౬

శా॥ శ్రీమద్రాఘువరామ! భాస్కరకుల ♦ క్షీరాబ్ధిసోమా! పరం
ధామా! పావననామ! పాలితమునీం ♦ ద్రిస్తోమ! నీలాంబు ద
శ్యామా! దైత్యవిరామ! భద్రగిరి ధా ♦ మా! పాభవోద్దామసీ
మా!మాలక్ష్మణ సంయుతాప్రతిమ! శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ ౭

మ॥ ధనురస్త్రంబులఁగేలఁబూనిన సుమి ♦ త్రాపుత్రుమన్ సిత్య శో
భనగాత్రంబునవెల్గు భూమిసుతయున్ ♦ బార్శ్వస్థులై యొప్పఁగా
మునినాథుల్ ముదితాంతరంగులగుచున్ ♦ మోలిన్ వసింపంగసౌ
మ్యసిరూఢిన్ నెలకొన్న భద్రగిరి శ్రీ♦ మద్ రామచంద్రప్రభూ ౮

మ॥ ఘనవామాంకమునందు సీతయును, వె♦న్కన్ మేటిసౌమిత్రి,ముం
దున సామీరియుఁబ్రక్కలన్ భరత శ ♦ త్రుఘ్నుల్ జెలంగన్,విభీ

షణ సూర్యాత్మజ ముఖ్యులన్యమగు బి♦ క్ధ్సానాళియందొప్ప, శ్యా
మనవాబ్దోపమమూర్తివై పొలుచు శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ

మ॥ దరమందస్మిత సుందరాననముతో ♦ దాక్షిణ్యపుంజూపుతో
శరచాపాబ్జ రథాంగహస్తములతో ♦ స్రక్చంద నాలంకృత
స్ఫురితశ్యామతను ప్రభావితతితోఁ ♦ బొల్పొందు నీరూపునే
స్మరియింతుఁ వెతలెల్లఁ దీరుటకు శ్రీ♦మద్రామచంద్రప్రభూ౧౦

శా॥ పారంబా; కసరాదు, మేలుసమకూ ♦ ర్పఁ బోదు, హర్షించువా
రేరైసన్ గలరా, యటన్నఁదిము ♦ న్నేసున్న, యిందేమియో
సారంబున్నదటంచుఁ నాసపడి ప్ర ♦ జ్ఞఁ వీడి దొర్లాట సం
సారాంభోనిధి కేల, వట్టిభ్రమ, శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ ౧౧

మ॥ ధరఁ నెంతేశ్రమఁనైనఁ గంగకెదురీ ♦ తన్ వోయి దర్శింపవ
చ్చు రమానాథుపదంబు శంకరు జటా ♦ జూటంబునందున్నయా
హరి గాంచుఁ గబళించి తత్సుధను, వే ♦ యానంగవచ్చున్ విసం
సరణాంభోనిధి దాఁటలేము కటా. శ్రీ♦మద్రామచంద్రప్రభూ౧౨

మ। కలితంబైన మనంబె, మూలమగు, రా♦గ ద్వేషముల్ మొల్కలౌఁ
బొలుచున్ శాఖలుఁ గాఁగ స్వర్గనరకం♦బుల్, సౌఖ్యదుఃఖంబులే
ఫల జాలంబగుఁ, నీమణత్రయము, శుం ♦ భత్పల్లవ శ్రేణి, దు
ర్మల సంసార మహీరుహంబునకు శ్రీ ♦ మద్॥ ౧౩

శా॥ ఈసంసార మహీజమందుఁ గల న ♦ న్నేరీతి, రక్షింతువో,
నీసాన్నిధ్యముఁ గోరినాడ, జడుఁడన్, ♦ విజ్ఞాన శూన్యుండ, మి

ఖ్యా సౌఖ్యాధ్వగతుండ,దుర్భరభవా ♦ యాసంబులన్ మాన్పవే,
త్మా సాధ్వీతనయా మనోరమణ! శ్రీ ♦ మద్॥ ౧౪

మ॥ నిజసౌఖ్యంబు లొసంగలేని వనితా ♦ నీకంబులన్, బుత్ర పౌ
త్రజన వ్రాతములన్, ధనాదులను, ని ♦ త్యంబంచుఁగాంక్షించి తాఁ
ద్యజియించున్ గద, ప్రాణమైన వెస,గా ♦ మార్థంబుగా మూఢుఁడా
త్మజయంబున్ గొనలేనివాఁడగుచు శ్రీ ♦ మద్రా ౧౫

మ॥ తనలోఁ నుండెడు ప్రాణమే, యితర భూ ♦ త వ్రాతమం దెల్లనో
ప్పెఁ నటంచున్ దలపోయు మానవునకున్ ♦ భేదంబుఁ గన్పట్టునే,
ఘన హింసాగ్రహ మూనునే; మదనహం ♦ కారాదులున్ గల్గునే,
మనితంబైతగు మోక్షమున్ గొనఁడె శ్రీ ♦ మద్రా ౧౬

మ॥ కడుపున్ నోరునుఁ గట్టిపెట్టుకొని. సౌ ♦ ఖ్యంబున్ వివర్జించి చే
డ్పడు దుఃఖంబులకున్ సహించి, తన బి ♦ డ్డండెద్రవ్వఁ గాసైనఁ జేఁ
నిడ కాసన్ గడియించు భాగ్యమది, త ♦ న్నేరీతి రక్షించుఁ న
మ్మఁడు గా "కర్థ మనర్థ" మంచుఁ గట, శ్రీ ♦ మద్రా ౧౭

శా॥ కోటల్, పేటలుఁ దోటలున్,గలిగినన్ ♦ గోటుల్, నిధుల్,స్వర్గసౌ
ఖ్యా టీకంబుల మించినన్,విడున, దీ ♦ యాశా మహాపాశ, మే
నీటాబోటి రకమ్ముఁ గూడిననుఁ ద ♦ న్వీన్ బొందవే మోహమున్
మాటల్ వేయుఁ నిఁకేల మోహాలకు శ్రీ ♦ మద్రా ౧౮

శా॥ ఏదో,కొంచెము ద్రవ్యమో, బలమొ,కా,♦ కేవిద్యయో,రూపమో,
లేదా! వంశమొ, బుద్ధికౌశలమొ, యో ♦ లిన్ గల్గఁ నమ్మాత్రుఁడ

న్నే దేవుండు సమీపమైనఁ గనుఁ గో ♦ డీ కన్నులన్ విప్పి, యు
న్మాదుండో బధిరాంధ మూకతల, శ్రీ ♦ మద్రా ౧౯

మ॥ తమకున్ లేవో, సమస్త భాగ్యములువి ♦ ద్యానైష్ఠికత్వాదులున్
గుమతుల్ చూచి, సహింపలేరకట, క ♦ న్నుల్ గుట్టి, యన్యుల్ మహా
శ్రిమంతో సద్వినియోగ భోగములకై ♦ సంపాదముల్ జేయు ధ
ర్మమయంబౌ బహు భాగ్యమున్ గనిన, శ్రీ ♦ మద్రా॥ ౨౦

మ॥ ఇలలోఁ నెల్లరు మెచ్చఁగా వలయుఁ నెం ♦ తేఁ దన్నుఁ గీర్తింపఁగా
వలెఁ బెద్దల్ మఱిఁ బిన్నలున్ దరుణులౌ ♦ వారంచు దంబంబుతో
సలుపంగాఁ జగునే, క్రితూత్సవముఖా ♦ శ్రాంతక్రియాసత్కృతుల్
మలఁగున్ దుర్గతులందు మూలమున శ్రీ ♦ మద్రా॥ ౨౧

శా॥ ధాత్రిన్ సూకర భైరవంబులకు సం ♦ తానంబు వాటిల్లదే,
పాత్రాహారముల్ బిపీలికలు సం ♦ పాదించి జీవింపవే,
పుత్రుల్ పౌత్రులు భోగభాగ్య విభవం ♦ బుల్ గల్గి గర్వించుఁన
మ్మాత్రన్ బూజ్యతవెల్గునే, నరుఁడు, శ్రీ ♦ మద్రా॥ ౨౨

మ॥ తొలిఁ దాఁ జేసిన పాతకంబులకునై ♦ దుఃఖంబు లెచ్చిర్లుటన్
దెలియన్ లేక దురాత్ముఁడీర్ష్య, సుకృతా ♦ ప్తిన్ సౌఖ్యముల్ వొందు పు
ణ్యుల కెల్లన్ దన యెగ్గు లేవాడమునఁ ♦ ట్లూహించుచుండున్ గటా
మలినాత్ముం డీఁతడంచుఁ నెల్లరన శ్రీ ♦ మద్రా॥ ౨౩

శా॥ ఏలా? యింత యసూయ నామదికిఁనే ♦ రే, దుష్టులౌ వారు కీ
డాలోచించి యొనర్పఁనంతఁ బ్రితిసే ♦ యన్ జూచెదన్ వారికిన్
మేలున్ సేయఁగరాదె, వారలకు నె ♦ మ్మిన్ దాన నిర్వాణస
న్మాలా లంకరణంబుఁ దాల్తుఁగద శ్రీ ♦ మద్రా॥ ౨౪

మ॥ తనువున్ రోగము లొందకుండుటకునా ♦ తృష్ణ క్షుత్పిపాసాదు లె
ల్లనుఁ బీడింపక యుండకుం గడుఁ సవా ♦ ర్యంబైన యుద్వేగముల్
జన, యుక్తాహార విహార యోగ్యమగుఁగా ♦ ర్జంబూనఁ గాం తేనిజా
త్మను సంధింపఁ నవశ్య మిచ్ఛయగు శ్రీ ♦ మద్రా॥ ౨౫

మ॥ సకలాధారుని, లోకరక్షకుని, మో ♦ క్ష శ్రీనివాసున్ నినున్
బ్రకటానంత గుణానుమోది, విపుల ♦ ప్రజ్ఞానఁ నాచార్యునిన్
సుకరంబైన, నితాంతభక్తి మదిలోఁ ♦ జొప్పించి పూజించునే
మకమున్ నాకుఁ బ్రసాద మీయఁగదె, శ్రీ ♦ మద్రా॥ ౨౬

మ॥ కలుషాజ్ఞాన మహాంధకార విలస ♦ త్కాంజాప్తుసత్క్షీణ త
త్వలతా వేష్టితుఁడార్తకానన మహా ♦ దావార్చి బోధైక సా
ఖ్యాలాలామ్ప్రదుఁడద్వయం డజుఁడుఁ బ్రి ♦ హ్మానంద సంధాయి ః
ర్మలుఁడౌ దేశికు శ్రద్ధఁగొల్వఁదగు, శ్రీ ♦ మద్రా॥ ౨౭

మ॥ కలితాహంకృతియందు పుట్టెఁనవివే ♦ కంబున్, దదీయంబునన్
మలినంబౌఁనభిమాన, మందుననుఁ గా ♦ మ క్రోధముల్ వానిచే
బలుకర్మంబులుఁ, దత్కృతంబులఁ దలం ♦ పన్ జన్మ దుఃఖాదులున్
మలయున్ బూర్వగతిన్, భవార్తునకు శ్రీ ♦ మద్రామ ౨౮

శా॥ నానా యోనులఁబుట్టి పుట్టి, గతజ ♦ న్మంబున్ గనన్ లేక య,
జ్ఞానారణ్య మహాంధకారమున ము ♦ న్గ జూచి, సైరింతువే,
దీనాలాపము లాలకింపవె; కృపా ♦ బ్ధీ! నీదు సాకార స
న్మానంబున్ దయసేయవే, శ్రితుఁడ శ్రీ ♦ మద్రామ॥ ౨౯

శా॥ పాపారణ్య దవానలుండవఁట, సం ♦ ప్రాప్తైక కళ్యాణ శో
భాపాదంబున, ముక్తిఁగూర్తువఁట, నీ ♦ భక్తాళికిన్ నిచ్చలున్

బాపంబుల్, ననుఁజుట్టుముట్టినవి యా ♦ పద్మాంధవా! రక్ష ని
మ్మా! పైమార్గపదంబుఁజూపి కృప శ్రీ ♦ మద్రామ॥ 30

శా॥ అక్షీణోగ్ర దురంతపాతక సము ♦ ద్యత్కష్ట కర్మాండ, నీ
సాక్షాత్కారముఁగోరినాడఁ శ్రితుఁడన్ ♦ సౌభాగ్యదాతా!నన్ను
రక్షింపందగుఁనయ్యా! నీచరణముల్ ♦ ప్రాప్యంబులంచెంచి ప
ద్మాక్షా!నమ్మితిఁగొల్వమాన నిక శ్రీ♦ మద్రామచంద్రప్రభూ॥ 31

శా॥ ఆవేశంబగుచుండె, నామనము ది ♦ వ్యప్రాకటోత్ఫుల్ల రా
జీవేందీవర పూజితంబయిన, నీ ♦ శ్రీపాదయుగ్మంబుపై
దేవా! రాఘవభూధవా! యటుఁ బ్రసాదింపన్ గదే, నాకికన్
క్ష్మావామా తనయార్చితాంఘ్రియుగ! శ్రీ ♦ మద్రామ॥ 32

మ॥ గురుసాకేతపురిన్, మనోజ్ఞ సరయూ ♦ కూలంబునన్, సైకతో
పరిభాగంబుల,ఁ నాటలాడిన, భవ ♦ త్పాదాబ్జముల్ నామదిన్
మురువొప్పన్ నెలకొల్పవే, కొలిచెదన్, ♦ ముద్దాడెదన్, నేత్రతా
మర సద్వంద్వముఁజేర్చి యద్దెదను, శ్రీ ♦ మద్రామ॥ 33

మ॥ భళిరే, కన్నుల పండువైతనరు, నీ ♦ బాల్యాకృతిన్ జూడఁగా
గళమందున్, బులిగోళ్ళు,ఁనెన్నుదుటఁజొ♦క్కంబౌలలామంబు, మా
ళి,లసత్పుష్పగుళుచ్ఛమున్,దిసమొలన్, ♦ లేనవ్వు,వాల్చూపులున్
మలఁగన్, లీల, నటించు, టబ్రమది, శ్రీ ♦ మద్రామ॥ 34

మ॥ గొనబౌ ముద్దుల పాలబుగ్గలునుఁ,ద♦ళ్కున్ జూపునెమ్మోముఁ,దీ
రినమేల్ తెల్లసి లేతదంతములు, ధా ♦ త్రిన్ దప్పటడ్గుల్, దన
ర్పునగున్, వచ్చియురాని మాటలుఁ గరం♦బున్ జూపు నీరూపునె
మ్మనమందున్ దలపోసి, పొంగెదను, శ్రీ ♦ మద్రామ 35

శా॥ గజ్జెల్ కాళ్లను, గల్లు గల్లురన, వేడ్కన్, జెంగనాల్ ద్రొక్కుచున్
గజ్జెంబుల్ కరపల్లవంబులఁ జెలంగన్, నోటఁ జొంగూర, మేల్
వజ్జన్, నీతలిఁ ద్రోల, ముద్దునుడులన్ ♦ వాక్రుచ్చు నీయాకృతిన్
మజ్జారే, యొకమాఱుఁ జూపఁదగు శ్రీ ♦ మద్రామ॥ ౩౬

శా॥ శ్రీరామా! భవదీయ నామమహిమ ♦ శ్రీ వైభవం బెట్టిదో
వారాంభోజదళాక్షి, కీరమునకున్ ♦ వాగ్లీల'' శ్రీరామ రా
మా రామా' యని చెప్పినంతనె కదా, ♦ యద్దాసికిన్ తత్వ సం
చారంబున్ గృపసేసినాడ వఁట, శ్రీ ♦ మద్రామచంద్రప్రభూ॥ ౩౭

మ॥ పతితాత్మున్, గతిలేక యున్న పడఁతిన్ ♦ బాషాణమైపడ్డ యా
చతురాబ్జాక్షి నహల్యఁ గాంచి కరుణన్ ♦ సంధిల్లి రక్షింప వే;
క్షితిఁ గాకాసురుఁ బాపకర్ముఁడనియున్ జేపట్ట ♦ లేదో కొక్కా, దు
ర్మతిఁ నంచున్ ననుఁ బ్రోవ మానెదవె, శ్రీ ♦ మద్రామచంద్ర॥ ౩౮

మ॥ అడవిన్ గ్రుమ్మరుచుండి, యొడవడి నీ ♦ వాకొంటివో, డప్పిచేఁ
నడరుం బొందితొ, నిల్చినాడ వెటఁనా ♦ హాయంచుఁ దాఁ గూర్మిఁ నెం
గిలి పండ్లిచ్చినఁ నాసి, యాశబరికిన్ ♦ గీలిచ్చి రక్షించు నీ
మదుఁ గెంచన్ దరమే, రఘుప్రవర! శ్రీ ♦ మద్రామచంద్ర॥ ౩౯

మ॥ బలితంబైన వికారభావములకున్ ♦ బట్టైన యామర్కటా
వళికిన్ సైతము నిల్కడల్ గఱపి, నిర్వాణాధికారాత్ములన్
సలుపన్ బూనిన నీకు, దుర్భరుడనే, ♦ చంచన్మనో వాన రా
మలభక్తిన్ గొని నన్నుఁ గావఁగదె, శ్రీ ♦ మద్రా॥ ౪౦

శా॥ నిన్నే నిత్యముఁగా గనమ్మిన ననున్ ♦ నీచస్థితిన్ లాగి యే
విన్నాణంబగు లోకమందునుతువో, ♦ వీతేచ్ఛఁ గైవల్య సం

పన్నన్ సేసెదో, జన్మదుఃఖమును మా ♦ న్పన్ మాత్రమేఁ గోరితిన్
మన్నాథా! తరువాత నీదుదయ, శ్రీ ♦ మద్రామ॥ ౪౧

శా॥ నీ నామంబుఁ దలంచినప్పుడు; నినుఁ ♦ సేవించు కాలాన, నీ
స్తానంబుల్ గనువేళఁ ♦ నీకథలఁ బ్రస్తావించుఁ నానాఁడు, నీ
ధ్యానంబుల్ బచరించుఁ నత్తఱిఁ ననం ♦ తా! పారవశ్యాత్మ స
మ్మానానంద సుఖంబు లే, మనుదు, శ్రీ ♦ మద్రామ॥ ౪౨

మ॥ ఎపుడో, ముందిక నిక్షణింపఁగలఁ నం ♦ చీకాల మెల్లన్, వృథా
చపలత్వంబునఁ నీడ్వఁ బూనితిఁ నప ♦ స్మారామయ భ్రాంతమౌఁ
నపుడీతుచ్ఛ శరీరదుస్థితికిఁ నైయావంతఁ జింతింప కా
త్మపదంబుల్ గయిసేయకేఁ నకట, శ్రీ ♦ మద్రామ॥ ౪౩

శా॥ అంతా లెక్కగణించి చూచిన, శతంఁ బో, యంతకున్ మించిక
ల్పాంతంబుల్ జనునా; భళీ, నిమిషభో ♦ గ్యంబైన యీతన్వభూ
ర్యాంతంబైన యనర్ఘభాగ్య విభవం ♦ బార్జించి పోషించుఁ న
మ్మంతో భ్రాంతిసిఁ గంతువేతుఁ నమో శ్రీమద్రా॥ ౪౪

మ॥ గతకాలంబునఁ జేసినట్టి ఘన దు ♦ ష్కర్మంబు లూహింపఁనే
గతికిన్ వోదునో, నారకంబౌదవునో ♦ కట్టా, భవన్నామ సం
తతమంత్రోచ్ఛరణంబు నాకొసఁగి, సం ♦ త్రాణంబుఁ జూపించి,స
న్మత రక్షాపరుఁడన్న కీర్తిఁగొను శ్రీ ♦ మద్రా॥ ౪౫

శా॥ ఆయుష్కాలముఁ జెల్లెఁనేసి నిమిషం ♦ బైనన్ మహిన్ నిల్పఁగా
నేయమ్మయ్యయుఁ నడ్డురారు కద, మే ♦ లే, బాధులన్ నమ్మ, స్వ
శ్రేయోదాయక మేమిటన్న; భవదం ♦ ఘ్రిధ్యాన మామొక్కటే
మాయించున్, భవరోగజాతముల, శ్రీ ♦ మద్రా॥ ౪౬

శా॥ ఏవో, కొన్నిదినంబు లీతనువుతోఁ ♦ నేనుండ నీయాజ్ఞ సం
భావింపన్ దయఁదాల్తువేని, కలసం ♦ బాధంబు, దుర్మైత్రి, దు
స్సేవా సక్తుల నాకొసంగక, భవ ♦ చ్చింతార్తిన్ గూర్చి యి
మ్మా! విజ్ఞాన సుఖానుభూతులను, శ్రీ ♦ మద్రా॥ ౪౭

శా॥ బాబూ! యేలినవారి కాలిదుము పైఁ ♦ బడ్డంతనే; ఆయియున్
దాఁబూఁబోడియు, యయ్యోఁ నీపడవయున్ ♦ మైతాలుపై వోయినన్
నాబాగెల్లని, కోరి, నీయడుగులన్ ♦ గడ్గఁగఁ నాబెస్తకున్
మాబాగన్న పదంబుఁనీగవొకో, శ్రీ ♦ మద్రామ॥ ౪౮

మ॥ శరణాపన్న శరణ్య! నిస్తులయశ ♦ ష్షాడ్గుణ్య! శ్రీరాఘు వే
శ్వర రాజన్యవరేణ్య! నీదుచరణా ♦ బ్జాబుల్ శరణ్యంబులం
చరి తమ్ముండగుఁ, నావిభీషణుఁడు ని ♦ న్నర్థింపఁ జేపట్టి, తా
మరసాప్తాన్వయ! వానిఁనేలవొకో; శ్రీ ♦ మద్రామ॥ ౪౯

మ॥ కలుషంబుల్ నశియింప,ఁనార్తులుఁదొలం♦గన్, మేలు సంధిల్ల, దు
ర్బలమేగన్, నుడి సత్యమేర్పడ, మనో ♦ రాణ్మత్త హంసంబు ని
స్తుల విజ్ఞానపయస్తరంగములయం ♦ దున్ దేల, సద్భక్తి, ని
ర్మల సాధువ్రజసేవ, నాకొసఁగు; శ్రీ ♦ మద్రామ॥ ౫౦

మ॥ చదువుల్,సంధ్యలు, నేర్చినేర్చి, పటు శా♦స్త్రప్రౌఢిఁదర్కించి యు
క్తి దువాళించి, కఠోర మార్గచణ వృ ♦ త్తిన్ మించి,, మేలేర్పరిం
చెద నమ్ముండని పెక్కుభాషల మనీ ♦. షి ఖ్యాతివర్తింప, నె
మ్మదికిన్ మేలుఘటిల్లునే; యకట, శ్రీ ♦ మద్రా॥ ౫౧

మ॥ సగుణాంబౌచును, నిర్గుణాంబనుచు, నై ♦ జంబౌచుఁదత్వంబటం
చుఁ గనన్ రాకయె, విశ్వమెల్ల నడుపున్♦జోద్యంబుఁగాఁనంచు శా

ప్రగతిన్ బెక్కురు వాదులాడుదురు బల్ ♦ సందేహ సంయుక్తి,న
మ్మంగ; నేరీతి వెలుంగు చూపెడెదవో, శ్రీ ♦ మద్రామ॥ ౨౨

మ॥ ఎదియో, లక్ష్యముచేత, నిన్ గురునిఁగా ♦ హృత్పద్మ మందుంచి స
మ్మద లీలన్, గని, సేవఁజేసి, గుణ ధ ♦ ర్మ ప్రక్రియన్, సర్వభూ
త దయాళుత్వము, సాధుసేవనముఁ నా ♦ ధారంబుగాఁ జూని నా
మదిఁ నానందముఁ బొందలేనయితి, శ్రీ ♦ మద్రామ॥ ౨౩

మ॥ వరుఁడో, సద్గురుఁడో, యెఱుంగ, ననుఁగా వన్ జాలువాఁడెయ్యెడన్
బరుఁ డన్ గాను మనోజయంబు లభియిం ♦ పన్ లేదు, సన్నిష్ఠచే
కుఱ దయ్యో; జని మృత్యు దుఃఖములుఁ బ్రాకున్ జీవువెన్వెంటఁ బా
మరవృత్తిన్ దొలఁగించి కావఁగదె, శ్రీ ♦ మద్రామ॥ ౨౪

మ॥ కలఁచన్ సాగె మనంబు, పెక్కుగతులన్ ♦ కైవల్య సంధామ! నిన్
బలుచందంబులఁగూర్చి తెల్పెడు మహా ♦ భాష్యోక్తు లాలించినన్
జలనంబేల; నుతింతు, భద్రిగిరి వా ♦ సంబూను సీతామనో
మల పంకేరుహహేళివంచెఱిఁగి శ్రీ ♦ మద్రామ॥ ౨౫

శా॥ నీపాదాబ్జమరందపానరతుఁడే ♦ నీచాత్ముఁ గీర్తించు ద్ర
వ్యాపేక్షన్ వహియించునే; చనునె; య ♦ న్యాగారముల్ వట్టి, ని
న్దాపారుష్య దురుక్తులన్ నుడువునే, పం ♦ తాలాడునే; యన్యులన్
మైపోకన్ గనునే; ప్రియంబుఁ జెడి శ్రీ ♦ మద్రామ॥ ౨౬

శా॥ ఏతీర్థంబులఁ గ్రుంకినన్, నియతుఁడై ♦ యేయాత్రలన్ జేసినన్
జూతాత్మన్ వ్రతదాన ధర్మములఁ నే ♦ పుణ్యార్చనల్ సల్పినన్
జేత స్స్వాస్థ్యమెసంగకుండినఁ గటా, చేకూడునే; రామ రా
మా! తాల్మిన్ భవదంఘ్రియుగ్మమిల, శ్రీ ♦ మద్రామ॥ ౨౭

మ॥ ధనమున్నన్, బలమున్నఁ గీర్తియుత వి ♦ ద్యా ప్రజ్ఞలున్నన్, మహా
ఘన సంపద్విభవంబులున్నఁ నవియున్ ♦ గాఢంబులౌ దైన్యదుః
ఖనికాయంబులుఁ గల్గనేనిఁ నవియున్ ♦ గాయంబునన్ జుట్టి యా
త్మను దర్శింపగ భీతిఁజెందుఁగద, శ్రీ ♦ మద్రామ॥ ౫౮

మ॥ కులగోత్రంబులు యోగభోగములు, స ♦ ద్గోప్యావ గోప్యంబులున్
బలుసిద్ధా స్థితులున్, గుణాగుణము లీ ప్రారబ్ధ దేహంబు నం
దలమున్ గాని వివేకదీపమగు స ♦ త్యాత్మన్ గలంగించునే;
మలఁగన్ బావకు మ్రింగునే, చదలు శ్రీ ♦ మద్రామ॥ ౫౯

శా॥ జాతుల్ రీతులుఁ నాకృతుల్ గతులుఁ నెం ♦ చంగామఱిన్ నీతుల్ మతుల్
జేతో వీథిఁ నెఱుంగ శక్యమగునే; ♦ లెక్కింప నందంద సం
భూతా న్యోన్యవిరుద్ధ ధర్మముల సం ♦ పూర్ణంబులైయుంట నీ
మై తంత్రంబుల లీలలే యగును శ్రీ ♦ మద్రామ॥ ౬౦

మ॥ తనదౌ వెల్గుల మేఘముల్ వొడమియున్ ♦ దన్ గప్పవేయవ్వి సూ
ర్యునిఁ నాత్మోష్ణతఁ బుట్టినట్టి పొగయున్ ♦ రూఢాగ్ని రోధింపదే
నినుఁగప్పెన్ గద మాయనీవలన జ ♦ న్మించెన్, ప్రవృద్ధిన్ గొనెన్
మసియింపంగదె, దానివోఁనణఁచి, శ్రీ ♦ మద్రామ॥ ౬౧

శా॥ సత్కర్మంబు లొనర్చి, తత్ఫలము, లి ♦ చ్ఛన్ నీకిడన్, సంచితం
బుత్కర్షన్ విడు, నిత్యకర్మవిధితోఁ ♦ నూనంగఁ బ్రారబ్ధముల్
యత్కించిత్తునుసిల్వనేరదిఁక, దఁన్ ♦ బాధింపదాగామి, యు
ష్మత్కారుణ్యత, దుష్కృతుల్ సడల శ్రీ ♦ మద్రామ ౬౨

మ॥ విశదంబైన పథంబుఁద్రొక్కి సముఁడై విజ్ఞాని కామాది దు
ర్దశవర్గంబులఁ వోఁనడంచి త్రిబలా ♦ త్మవ్యక్తు విచ్ఛాదులన్

వశతన్ మానసమందు నిల్పి, నినుఁ గొ ♦ ల్వన్ జన్మలన్ వీడి యా
త్మశమంబున్ గొనఁడే; మహాత్ముఁడయి శ్రీ ♦ మద్రామ॥ ౬౩

శా॥ జ్ఞానం బార్జన సేయుచుండి మనసున్ ♦ స్వాధీనతన్ వొంద లే
కే నైపుణ్యముఁ జూపినన్ వశముగా ♦ వీ యింద్రియంబుల్, యథే
చ్ఛా నిర్విష్టము లౌచు, సారథిని జా ♦ ర్జన్ వోసి గుఱ్ఱంబులౌ
మౌనీంద్రస్తుత! వీనిఁ గావఁ గదె; శ్రీ ♦ మద్రామ॥ ౬౪

మ॥ తనువున్ రోసి, వసూసుతాదిహిత బం ♦ ధంబున్ దెగన్ గ్రోసి, 'కూ
ర్చిన సంపత్తులఁ బాసి, యనన్యమగు వా ♦ రిన్ దూరతన్ ద్రోసి, యొ
క్కనిఁ గానన్ గురిఁజేసి, వేఱుఁగన కిం ♦ కర్కున్ గొల్చువానిన్ మదా
త్మను సంధింతుఁ“నటన్న, నిన్ దలఁతు శ్రీ ♦ మద్రా॥ ౬౫

మ॥ క్రతువుల్, ధ్యాన జపవ్రతార్చనలుఁ దీ ♦ ర్థవ్రాతముల్ యాత్రలున్
దత సత్కర్మలు, స్తోత్రముల్, భజనముల్ ♦ దానంబులున్ ధర్మముల్
క్షితి సత్రాలయ కూప ముఖ్యసుకృతుల్ ♦ నిష్కామ్ములై పెక్కున
మ్మతులన్ సల్పుట, నిన్నుఁ జెందఁ గద శ్రీ ♦ మద్రామ॥ ౬౬

శా॥ ఇచ్ఛా నిచ్ఛలు లేక, ద్వంద్వముల కెం ♦ తే సైచుచున్, సంతసం
బాచ్ఛాదింపఁగఁ బూర్వకర్మగతిఁ గా ♦ ర్యానీకమున్ గెంటుచున్
స్వచ్ఛజ్ఞానముతో, సరోరుహదళాం ♦ చన్నీరమున్ వోలె, యు
ష్మచ్ఛాస్త్రిన్ నెఱపున్, వివేకియిల, శ్రీ ♦ మద్రామ॥ ౬౭

మ॥ తమిఁ నెంతేఁ గొని తెచ్చిపెట్టుకొని, మి ♦ థ్యాప్రేమఁ గల్పించి, చి
త్తముఁ నెల్లన్ ధనమందు నిల్పి విటజా ♦ తంబున్ గఱింగించు బో
గము దానిన్ బురుడించి, లౌకికములన్ ♦ గావించుచున్ జ్ఞాని యా
త్మ మమత్వంబును నిల్పు నీపయిన శ్రీ ♦ మద్రామ॥ ౬౮

మ॥ కులటాబ్జాక్షి తనున్ నిజేశ్వరుఁడు పై ♦ కొన్నన్ మనంబెల్ల ని
శ్చల కాంతున్ దనహాసుకాని పయిఁ జేర్పన్ బూనునట్లెల్ల క
ర్మలు సంసారమునందు సల్పుచును, స్వా ♦ త్మన్ నీయెడన్ నిల్పు ని
ర్మల లక్ష్యాంచితభక్తుఁ డాబుధుఁడు శ్రీ ♦ మద్రామ॥ ౧౯

మ॥ ముకురంబందున నైజవక్త్రమును దా ♦ మోదాప్తిఁ గన్గొన్న యొ
ద్దిక, లోఁ జూచిన దర్శనంబగును, ర ♦ క్తిన్ శ్రీపరబ్రహ్మమా
ప్రకటార్థంబుఁ నెఱుంగఁ జెప్పెడు ♦ గురున్ బ్రార్థింపుమాయంచు మా
మకచిత్తంబున బోధసేయఁగదె, శ్రీ ♦ మద్రామ॥ ౨౦

మ॥ మమతాహంకృతులే గదా, సకల జ ♦ న్మ క్లేశముల్ దెచ్చు స
త్య మనీషన్ బొడ, గానలేక, నిను, మా ♦ యా భ్రాంతిచేఁ జిక్కి స
ర్వముఁ గర్తృత్వము తోడసేతుఁ నకటా! ♦ వారింపవే, వీసిక
ర్మముఁ లేఁ నొల్లను, స్వప్నమందయిన, శ్రీ ♦ మద్రామ॥ ౨౧

మ॥ నిను దర్శింపఁగఁ గోరు భక్తుఁడొగిఁ దా ♦ నిద్రించినన్, లేచినన్
బనులేవేసి, నొనర్చినన్ సతతమున్ ♦ లక్షించి, త్వత్పాద చిం
తనమున్ సేయుచుఁ జొక్కుచున్ వెసఁ నహం ♦ కారోగ్రభావంబు నె
మ్మనమందున్ విడఁనాదు, నేర్పునను శ్రీ ♦ మద్రామ॥ ౨౨

మ॥ నిగమాంతంబులఁ జూడవచ్చు, శ్రుతులన్ ♦ నేర్వంగ వచ్చున్, బురా
ణ గతుల్, శాస్త్రపదంబు, సూత్రనియతిన్ ♦ సాధించి, సర్వజ్ఞతన్
సొగసౌమాటలఁ నెన్నియో నుడువ వ ♦ చ్చున్ గాని, సత్యంబుఁ బ్రా
మఁగఁ నాత్మానుభవంబు చేకుఱదు, శ్రీ ♦ మద్రామ॥ ౨౩

మ॥ సుకుమారంబని, రూపమూలమని, య ♦ స్తోక ప్రియోదాత్త సా
ధక లీలారతి, భర్మ సౌధములఁ ను ♦ ద్యానాళిఁ బూఁ బాన్పులన్

జకితామూల్య విశేష చేలముల మేల్ ♦ సంరక్షఁ గావింతుఁ రీ
మకిలంబైన మెయిన్, వృథాశ్రమను, శ్రీ ♦ మద్రామ॥ ౭౪

మ॥ రసమేధోరు ధిరాస్థి మాంసమల చ ♦ ర్మంబైన యీరోఁత కొం
ప, సతంబున్, శుచి సల్పఁగాఁ నగుఁ నొకో, ♦ ప్రజ్ఞాన తీర్థంబునం
దసమానందమదాత్మ, స్నానమును సే ♦ యన్, బాధమీఁడేటి, దీ
మసమౌఁ తేజముఁ నొందఁడే; నరుఁడు, శ్రీ ♦ మద్రామ ౭౫

మ॥ అకటా, వజ్రమయంబె నిల్చుటకు, సం ♦ ఖ్యాతీతకాలంబు, వా
ర్ధకమున్ రోగములున్ ఘటిల్లవె; యలం ♦ తన్ స్రుక్కి జీర్ణింపకుం
టకు సాధ్యంబగునే; తటాలుమని పీ ♦ డన్ జీవుఁడీ తన్వు న
మ్మక మెట్లుండునొ; పిమ్మటన్ దెలియు, శ్రీ ♦ మద్రామ ౭౬

మ॥ కడు వేగంబునఁ బాఱుచుండెఁ నకటా; ♦ కాల ప్రవాహం, బిదె
ప్పుడొ,యొడ్డున్ దెగఁగొట్టికూల్చుఁదనువన్ ♦ భూమీరుహంబున్
వృథా।సడలన్ జేయుచుఁనుంటిఁ నాయువును, నిన్ ♦ సద్భక్తి సేవిం
పకు।మ్మలికన్ సద్గురు మార్గమున్ మఱచి శ్రీ ♦ మద్రామ॥ ౭౭

శా॥ కట్టా, పుట్టుకఁ జెట్టలిట్టి వనుచున్ ♦ గట్టెక్కి నీగుట్టుఁ జే
పట్టన్ మెట్టులు గాఁగలట్టి తెఱవుం ♦ బట్టుల్ గదా, ముక్తికిన్
బట్టంబుల్; సొగసుట్టు నీయడుగు లె ♦ ప్పట్టున్ బిగంబట్టి నీ
మట్టున్ బిట్టుగ ముట్టినేఁ గొలుతు శ్రీ ♦ మద్రామ॥ ౭౮

మ॥ విభవం బిత్తువొ; విద్యఁ గూర్తువొ; మహా ♦ విఖ్యాతిఁ జేకూర్తువో
రభసంబైన దరిద్ర మిచ్చెదొ, మఱే ♦ ప్రారబ్ధ మీఁడేర్తువో
యుభయంబైన భవద్విచింతిత సుఖా ♦ ర్థావాప్తి లేకెట్లు జ
న్మ భరింపన్ గలవాఁడ, నీదుకృప, శ్రీ ♦ మద్రామ॥ ౭౯

మ॥ ఎవరిన్ వేడిన నేమి సార్థకము, ని ♦ న్నే; సర్వమౌదిక్కుఁగా
భవ దుఃఖోత్తరణంబుగాఁ దెలిసి బల్ ♦ పంచేంద్రియవ్యాప్తిఁ బోఁ
నవలన్ద్రోసి, సతంబుఁ గష్టపడి, ని ♦ న్నర్థించి సాధింప కా
త్మ విధిన్ నేఁభజియింపఁనైతి నిను శ్రీ ♦ మద్రామ॥ ౭౦

శా॥ సుఖ దుఃఖంబులు, మేలుకీడులు, జనిం ♦ చున్ ద్వంద్వరూపంబులై
నిఖిల ప్రాణులకున్ సమానగతి, నీ ♦ విన్ సైచువాఁడేయగ్రో
ముఖలోకంబుల పాలుఁగాఁడు, భవ దు ♦ ర్మోహాహికిన్ జిక్కఁడే
మహిముల్ సేసిన నిట్టి మేల్గొనఁడు, శ్రీ ♦ మద్రామ॥ ౭౧

మ॥ తిరుగన్ జొచ్చెదు కాల దుర్గతికిఁ జిం ♦ తింపంగఁ నేలా; ప్రవి
స్తర సంసారమునందు మేలు గలదే; ♦ సౌఖ్యంబటంచున్ భ్రమన్
సరకున్ జేయనుగాక దానఁగల క ♦ ష్టంబెల్లఁ నూహింపకే
మరుపాటున్గొని నీపదాబ్జముల, శ్రీ ♦ మద్రామ॥ ౭౨

మ॥ ధనముల్ గల్గవటంచు షడ్రస పదా ♦ ర్థ వ్రాత మింపంచుఁ బెన్
వనటన్ బట్టెదు పొట్టకూటికయి, ♦ వాపోవనేలా; మహిన్
దనివిన్ బొందఁగరాదె, నీరములచే ♦ తన్, బత్రిముల్ దుంపలున్
మనుపన్ జాలవె; దుఃఖ మొందుకిఁక, శ్రీ ♦ మద్రామ॥ ౭౩

మ॥ పలుకుల్ వేయునిఁకేల, ముక్తి కలదే; ♦ పై మెట్ట వేదాంత సూ
క్తుల, దేహంబిది గల్గినందులకు, నీ ♦ కున్ దీనఁ గష్టించి, వా
క్కులఁ గీర్తించి, గడించు భాగ్యముల మ్రొ ♦ క్కుంబళ్లుఁ జెల్లించిఁ ని
ర్మల తేజోనిధిగాక, నేర్పునను, శ్రీ ♦ మద్రామ॥ ౭౪

మ॥ విడువన్ వచ్చునె, యెన్ని చెప్పినను బృ ♦ థ్విన్ వాసనానీకముల్,
సడలంగాఁ నగునే; నిజోచిత హితా ♦ చార క్రియావృత్తమున్

వడిఁ జేతః పరిపక్వమొందకయె, య ♦ ద్వైతాను సంధానముం
మడుఁ గొప్పన్ గొనఁ నౌనె; మూర్ఖతను శ్రీ ♦ మద్రామ॥ ౪౫

మ॥ గుణముల్ నాకును,నిర్గుణంబులవి నీ ♦ కుం,మాన్యతల్ నాకు,శూ
న్యనతుల్ నీకు, యశంబు నాకు, నసమ ♦ జ్ఞా భావముల్ నీకటం
చును, నిన్నుం దెలియంగలేకఁజెడుఁగాఁ♦జొప్పానుచున్, జ్ఞానస
న్మణి వీడం దలపోతు రజ్ఞులిల, శ్రీ ♦ మద్రామ॥ ౪౬

శా॥ ఏరూపంబున,ఁ నే గుణావళినిఁ నే ♦ యే నామముం వెట్టి, తా
రారాధింతురో, వారి కాక్రమము నం ♦ దారూఢిఁ గల్పించి యా
యారీతిం గొని, దర్శనం బొసఁగి, కా ♦ మ్యాళిం బ్రసాదించి వే
మారుం సర్వమయుండవై వెలుగు శ్రీ ♦ మద్రామ॥ ౪౭

శా॥ ఉన్నావొక్కొక జీవునందునఁ బరం ♦ జ్యోతి స్వరూపంబుతోఁ
గన్నన్ గేవల సాక్షి మాత్రము, నిరా ♦ కారంబనై, జ్ఞాన సం
పన్నత్వంబును, వ్యాపకంబును, నహిం ♦ పంగల్గి దేహత్రయిం
మన్నింపంగల రామనాముఁ డవు;. శ్రీ ♦ మద్రామ॥ ౪౮

మ॥ హరిరుద్రాబ్జజ గజాన నార్క హరిణాం ♦ కాగ్ని గ్రహాదుల్ సురల్
వర దిక్పాలురు, లోక పాలురు,ముని ♦ వ్రాతంబులుం బల్ చరా
చర భూతాత్మకమైన సర్వ జగతీ ♦ చక్రాబ్జ గర్భాండముల్
మరునయ్యా! భవదీయ మూర్తులగు శ్రీ ♦ మద్రామ॥ ౪౯

శా॥ నిన్నేమంచుఁ దలంతు సత్యగతితో, ♦ నిత్యుండ వాద్యుండ వా
పన్నానీక శరణ్య! విశ్వమయతం ♦ బ్రహ్మ స్వరూపుండవై
చిన్నిర్మాణము సేయుచుందు వఁట, వా ♦ సిన్ షడ్గుణైశ్వర్య సం
పన్నత్వంబు ధరించి బ్రోచెదవఁట, శ్రీ ♦ మద్రామ॥ ౫౦

శా॥ నిన్నున్ గాంచ, మునీంద్రచంద్రులు తపో ♦ నిష్ఠాత్ములై, కానలం
దన్నాదుల్ ద్యజియించి వాయువశతా ♦ త్మారూఢిఁనున్నార లా
పన్నుల్ భక్తిఁబ్రపత్తి, మార్గములనిన్ ♦ బ్రాప్యంబుఁ గానమ్మియు
ష్మన్నామామృతమాని కొల్చెదరు శ్రీ ♦ మద్రామ॥ ౯౧

శా॥ సకల ప్రాణి హృదంతరాళముల వా ♦ సంబూని దుగ్ధంబులం
దకలంకస్థితిఁ నాజ్యముండు వడువన్ ♦ వ్యాపించి యున్నాడ వీ
వకటా, సత్కృషి లేక నిన్నుఁ గన సా ♦ ధ్యంబౌనె; యాత్రోవమా
మక చిత్తంబునఁ గీలుకొల్పఁ గదె; శ్రీ ♦ మద్రామ॥ ౯౨

శా॥ ఆకాశంబును వోలె సర్వమయతన్ ♦ వ్యాపించి తేజోగతిన్
లోకంబుల్ జనియింప, వృద్ధిఁ గొన, నీ ♦ లోఁ నైక్యమొందంగ నీ
వే,కా మూలమవై నిరామయుఁడవై, ♦ వేదాంత వేద్యుండవై
మైకోఁ గల్గి ప్రకాశ మీనెదవు, శ్రీ ♦ మద్రామ॥ ౯౩

శా॥ శుద్ధాగ్నిన్ గ్రహియించి వాయుజల సం ♦ శోధంబుచేఁ గేవలం
బిద్ధాత్రిన్ గల సర్వశక్తులకు సా ♦ హిత్యంబుఁ గావించు సం
బద్ధాయోఃమయ యంత్రమై పొసఁగి జీ ♦ వప్రజ్ఞలన్ మీఱి శు
భద్ధర్మంబుల ముక్తిఁ నేలుదువు శ్రీ ♦ మద్రామ॥ ౯౪

శా॥ అద్వైతత్రయమందుఁ జెన్నలరు, భా ♦ వాద్వైత మార్గంబు వి
ద్వాద్వైవ దుష్యము తోడనేర్చి, క్రియా ♦ ద్వైత క్రమంబెంచి, ద్ర
వ్యాద్వైత ప్రపథం బెఱింగి మది, దాఁ ♦ నద్వైత తత్వంబు ధీ
మద్వర్యుండు వహించి, చెప్పఁ దగు, శ్రీ ♦ మద్రామ॥ ౯౫

శా॥ ద్వైతంబున్ గమనింపలేక, మఱి, య ♦ ద్వైతంబు గుర్తింప లే
కైతిన్ గాన, కెదన్ దలంపక, విశిష్టా ♦ ద్వైతమున్ మోట,తాఁ

జేత స్వాస్థ్యములేని భాషణములన్ ♦ జేటొంది, యద్వైత దృ
జ్మాతంగుండఁ నటంచుఁ గూయు, మృష, శ్రీ ♦ మద్రామ॥ ౯౬

శా॥ కాదంచున్ వచియింపఁనేలఁ బర మా ♦ ర్గ గ్రాహ్యతన్ వీడి, స
త్యాదుల్ శౌచ మహింస, శాంతి, గల యా ♦ త్మానంద సామ్రాజ్యసం
పాదోద్యత్క్రియుఁడున్, జితేంద్రియుఁడుఁ ద్వ ♦ త్పాదాబ్జ చింతారసో
న్మాదుండున్ భవమున్ దరింపఁడొకో, శ్రీ ♦ మద్రామ॥ ౯౭

మ॥ నినుఁ నేమంచుఁ దలంచినన్, గొఱఁత యే; ♦ నిర్వాణ భాగ్యంబు నె
మ్మనమున్ నిశ్చలరీతిఁ నుంచక, వృథా ♦ మార్ త్రోవలన్ వట్టి నిన్
గనలేరైరి, యనేక భేదగతులన్ ♦ గల్పించుకొంచజ్ఞు లా
త్మ స్థిరూఢంబగు లక్ష్యమున్ మఱచి శ్రీ ♦ మద్రామ॥ ౯౮

మ॥ పరిపూర్ణాత్ములఁ గర్మయోగులు, నినున్ ♦ భాషింతు రామేటి పం
క్తి రథోర్వీధవ నందనుండవను సూ ♦ క్తిన్, జ్ఞాన యోగుల్ వచిం
తురు నీవంతర దీపకుండవని, యిం ♦ దున్ రెంటఁ నెందైనఁ నా
త్మరతిన్ మానక కొల్వఁగాఁ దగదె; శ్రీ ♦ మద్రామ॥ ౯౯

మ॥ సగుణంబైనను, నిర్గుణంబయినఁ గాంచంగల్గు తత్వంబు తోఁ
దగు భక్తిఁ భజియించువారికి, విరు ♦ ద్ధంబెందునుండోప కి
మ్మగ నీదర్శన మిచ్చుచుందు వఖిలాం ♦ భోజాండముల్ నీదు క
ర్మ గరిష్టాద్భుత లీలలే, యగుట, శ్రీ ♦ మద్రామ॥ ౧౦౦

మ॥ ఎటులైనన్ భవదీయనామ మది, యూహింపన్ సహస్రాఖ్యులన్
దిటవై, వేదగభీరమై, దితిసుతా ♦ స్త్రీగర్భ విచ్ఛేదమై
పటుదివ్యామృతకందమై, శుభదమై, ♦ పాపౌఘ విధ్వంసమై
మటు మాయంబొనరించుఁ నాపదల శ్రీ ♦ మద్రామ॥ ౧౦౧

మ॥ అల"నారాయణ" మంత్రమందున, ద్వితీ♦యంబైన,'రా'వర్ణముం
దలపోయంగ"నమశ్శివాయ" యను త♦త్పంచాక్షరీ మంత్రమం
దు,లలిన్ గల్గు"మ"కారమున్ గలిపి ♦ భక్తుల్ విష్ణురుద్రాత్మకా
మలరూపంబుగ నిన్ స్మరించెదరు శ్రీ ♦ మద్రామ॥ ౧౦౨

మ॥ వరతత్త్వార్థము నీదుశబ్దమునఁ ద ♦ త్త్వంబంచుఁ జాటించుఁ గం
దిరవో"రా" యనునక్షరంబు మదిఁనూ ♦ హింపన్,నిరాకారమా
బరమాత్మంబనియున్ "మ" వర్ణముఁదలం ♦ పం బ్రత్యగాత్మంబుగా
స్మరణన్ గొల్పెడుఁ నాగమాంతములు శ్రీ ♦ మద్రామ॥ ౧౦౩

శా॥ "రా"వర్ణంబు వచించుమాత్రమున వ ♦ క్త్రంబుఁదునన్ నుండివే
వోవున్ బాతకరాసి, క్రిమ్మరభయం ♦ బున్ జెంది జొత్తెంచఁగాఁ
నావంకన్ దంఃపౌ "మ" కారమొగిఁన ♦ ఛ్లాటన్ భవత్సంజ్ఞ రా
మా!నాపుచ్చు దురాగ్యలీకలిని శ్రీ ♦ మద్రామ॥ ౧౦౪

శా॥ ఆనందంబున నీదుమంత్రము ను నేఁ ♦ నాధారమున్ బొంది యె
ట్లయినన్ "రామ" యటంచు నాల్కనుడువన్ ♦ హర్షించిసాక్షా
త్కృతిన్ । జ్ఞానంబున్ గృపసేసి నామది,రమిం ♦ చన్ గల్గె దీవాత్మ,
స। న్మానాత్మ."రమతీతిరామ" యన, శ్రీ ♦ మద్రామ॥ ౧౦౫

శా॥ నీసాక్షాత్కృతిఁ నొంది ధన్యత, సినున్ ♦ గీర్తించు సంకల్ప మొం
తేసంధిల్లియు, నోరుఁజాలమికి జిం ♦ తింపన్, దదీయాశయం
బాసాంతంబుఁనెఱింగి యాధృపున కి ♦ య్యన్ లేదె; తచ్ఛక్తిఁ న
మ్మో సంప్రీతి, వచించితీ కృతిని, శ్రీ ♦ మద్రామ॥ ౧౦౬

మ॥ దళమో, పుష్పవితానమో, ఫలమొ, సా♦ధ్యంబైన యద్దానఁ జే
సలిలంబో, ప్రియమార, నాకొసఁగినన్ ♦ సంతృప్త చిత్తంబుతో

జెలు వొప్పఁగ గ్రహియించి సమ్మదమునన్ ♦ జేకూర్తు౯నిష్టార్థ దా
మల భాగ్యంబులఁ నెల్లనీకనవె శ్రీ ♦ మద్రామ॥ ౧౦౭

మ॥ ధన సాధ్యంబులఁగుళ్లు, గోపురములున్ ♦దానక్రియల్ యాగముల్
ఘనసత్రావళులట్టివెవ్వియును ని ♦ ర్మాణంబుఁగావించి నిన్
దనుపన్ లేను, కటా, కృపానిలయ! త్వ ♦ త్కారుణ్య మీలీలఁనా
త్మనుఁ జేరేపణసేయ, వల్కితిటు, శ్రీ ♦ మద్రామ॥ ౧౦౮

మ॥ పరభావంబులునొవ్వ, నింద్యములఁ నా ♦ పాదించి, సోత్కర్షఁ బ
ల్మరుఁగుంభించి,నయంబుడించి,కడువ♦ల్కన్ జూనుమద్వాక్యముల్
సరసంబుల్, సఫలీ కృతంబులయి యు ♦ ష్మద్దివ్య నామామృత
స్మరణోపాయముననన్ దరించినవి, శ్రీ ♦ మద్రామ॥ ౧౦౯

శా॥ నీవే, యాత్మవుగా, మహీజ మతిఁగా, ♦ నీబంటులే ప్రాణముల్
గా, వాసంబది మేనుగా, విషయభో ♦ గంబుల్ సపర్యాక్రియల్
గా, వీఁకన్ గను నిద్ర, నిశ్చలతఁనేఁ ♦ గావించు ధ్యానంబు గా
మావంద్యా! తలపోతు నీకనుచు శ్రీ ♦ మద్రామ॥ ౧౧౦

శా॥ నాసంచారములే, ప్రదక్షిణ విధుల్, ♦ నాపల్కు వాక్యంబులే
నీ సంకీర్తనలేఁ నొనర్చు పనులే, ♦ నీ కెంచఁ నారాధనల్
నా సర్వస్వము నీ యధీనమనుచున్ ♦ భావించుచుంటిన్, బరా
త్మా! సత్యమ్మిటులేలు మింక నను శ్రీ ♦ మద్రామ॥ ౧౧౧

శా॥ ఆవాసంబుగ నీవెసంగెదు నయో ♦ ధ్యా పట్ట మానంద రూ
పావిష్టంబగు మోక్ష మాపురికి, జే, ♦ డాజి ప్రభుండ ద్వితీ
యా వాఙ్మానస గోచరుండయిన బ్ర ♦ హ్మాంబా,ఁద్రిశక్తుల్ సతుల్
మావంద్యా! యతణిన్ వరించి రాగి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౨

మ॥ సరవిన్, గోసలనాథ పుత్రియగు ని ♦ చ్ఛాశక్తియే నీకు మా
త, రహిన్ గేకయరాజ నందనయె యా ♦ ధాత్రిన్ క్రియాశక్తి, వి
స్తర శోభాయుత, జ్ఞాన శక్తియె, సుమి ♦ త్రాదేవి, యోసన్నుతా
మరకీర్తి ద్యుతీ! యాత్మవీవుకద, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౩

శా॥ అవ్యక్తం బనునట్టి బాల్యదశ, నీ ♦ వజ్ఞాన తాజీవ వృ
త్తి వ్యాప్తిన్ నిజరూపమున్ మఱచి, యా ♦ దేహేంద్రియాదిప్రపం
చ వ్యూహంబిది నేనటన్న యభి మా ♦ నంబూని వెల్గొందు క
ర్మ వ్యక్తుండవు నీవుగాదె; హరి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౪

మ॥ శ్రవణంబన్న వశిష్ఠ బోధఁ దెలివిన్ ♦ రంజిల్లి యాపిమ్మటన్
జవమారన్, మననాంకుడై యెసఁగు వి ♦ శ్వామిత్రు నా దేశతన్
సువిరాగంబను లక్ష్మణున్ వడయుచున్ ♦ శోభిల్లు శ్రీ రామ నా
మ! విరాజత్సుగుణాభిరామ! విభు! శ్రీ ♦ మద్రామ॥ ౧౧౫

మ॥ మననాంకుండగు గాధి నందనునితో ♦ మాన్య క్రియన్ వోవుచున్
ఘనమౌ బంచ మహాఘనామ గిరులన్ ♦ గర్వాబ్ధిస్థితిన్ దాఁటి, జ్ఞా
న నిశాతాస్త్రముచేతఁ నావరణమున్ ♦ దత్తాటకన్ గూల్చి తీ
మనుజానీకము లేరు నీసములు; శ్రీ ♦ మద్రామ॥ ౧౧౬

మ॥ జలధిన్ ముంచితి వొక్క పెట్టునను, ని ♦ చ్ఛా నీచు మారీచు, ని
శ్చల రీతిన్ దొలఁగించి నాడవు, సదా ♦ చారంబు నావొల్చు ద
త్కలితాహల్యా సమాఖ్య శాపమును, వీ ♦ కన్ జొచ్చితే కాంతనా
మలసత్పట్టణమైన యా మిథిల శ్రీ ♦ మద్రామ॥ ౧౧౭

మ॥ ధరణీ నాథుని శాంత రూప జనకున్ ♦ దర్శించి భగ్నంబుగాఁ
దరలన్ మేటియసూయ నా శివుని కో ♦ దండంబుఁ దూలించి ఘు

స్థిరతా నంద సమాఖ్య జానకినిఁ బ్రీతిన్ బెండ్లియై, సంతతా
మర మానిస్తుత! సౌఖ్యమొందితివి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౮

మ॥ మదమున్ భార్గవరాము గర్వమును, సమ్యగ్గ్లీలఁ దూలించి, మో
క్ష దశాయోధ్యను జేరి, జీవుఁడనుఁ నేఁ ♦ గాదంచు, జీవత్వమున్
వదలన్ గల్గిన భావనంబనెడుఁ త ♦ త్పట్టాభిషేకంబు స
మ్మద లీలన్ గొనఁనున్న శ్రీహరివి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౯

మ॥ సరగన్ దద్విభవుండవౌతటిఁ గ్రియా ♦ శక్త్యాఖ్య కైకేయిచే
నెటిఁ జాపల్య మటన్న విఘ్న మొదవన్ ♦ శీఘ్రింబ తద్రాజ్యమున్
సరవిన్ వీడి, సతీ యుతుండవయి, యా ♦ సౌమిత్రితోఁ గూడి ధ
ర్మరతిన్ గానల కేగి నట్టిహరి! శ్రీ ♦ మద్రామ॥ ౧౨౦

శా॥ చిత్తంబన్ సరయూ నదిన్ గడచి వా ♦ సిన్ బుద్ధి సంజ్ఞా గుహున్
వృత్తం బొప్పగఁ నాదరించి పిదపన్ ♦ విక్షేప నామాటవిన్
బత్తిన్ సొచ్చి వధించినావు తపమున్ ♦ బల్ చిత్రకూటాద్రిపై
మత్తాహంకృతుఁ నావిరాధుఁ నట శ్రీ ♦ మద్రామ॥ ౧౨౧

మ॥ మనసై గ్రాలెడు కాకదైత్యుని,ఁ గృపన్ ♦ మన్నించి సంకల్పమున్
గను, వే గ్రుచ్చియు, నిర్వికల్పమను మేల్ ♦ కన్నిచ్చి, వీర్యాఖ్యఁనొ
ప్పు నగస్త్యుఁ దగఁ నాశ్రయించి, ధృతిఁ జొ ♦ ప్పున్ వట్టియేతెంచు ధ
ర్మరతిన్ వాయసియట్టి దిట్టఁడవు, శ్రీ ♦ మద్రామ॥ ౧౨౨

మ॥ ధృతియన్ గోలవిరూపిఁ జేసితివి ప్రోద్దిన్ గామమున్ పేరియా
యతివన్ శూర్పణఖన్ వధించితివి నీ ♦ వాగామి కర్మాఖ్యులౌ
దితిజాళిన్ ఖరముఖ్యులన్, దమియనన్ ♦ దీపించు మారీచ దు
ర్మతి వంచింపఁగఁ ద్రుంచి తాఖలుని శ్రీ ♦ మద్రామ॥ ౧౨౩

మ॥ పనిమై రాజసమన్న రావణుఁడు దం ♦ భంబన్న సన్యాసియై
చని యానందమహీజ ముచ్చిలి, ప్రకా ♦ శంబన్న లంకాపురం
బునఁ జేర్చెన్, గట, యామెఁ గానక కదుర్ ♦ బోక్ష్యాని నీవప్డుల
క్ష్మణు తోడన్ వెదకన్ జరించితట శ్రీ ♦ మద్రామ॥ ౧౨౪

శా॥ ఆనందంబను సీతఁ గానక, క్షమ ♦ ద్యక్షేద చిత్తుండవై
కానన్ గ్రుమ్మరఁగా, వివేకమను ప్ర ♦ ఖ్యాతున్ జటాయున్ గృపన్
జానొందన్ విమలత్వమన్ సుగతికిన్ ♦ సాధించి సత్యాంబు నా
మా నామార్గమునన్ గమించితివి, శ్రీ ♦ మద్రామ॥ ౧౨౫

మ॥ పటుకోపాఖ్యునిఁ, దత్కబంధ దితిజున్ ♦ భంజించి, సంతోష వి
స్ఫుట భావాత్త వికాసమన్న శబరీ ♦ పూజాది కంబోజఁ నా
దట లీలన్ గ్రహియించి, మారుతి నిధి ♦ ధ్యాసా స్వరూపాంకుఁబి
మ్మటఁ గైకొంటివి భృత్యుగాఁ నదిర, శ్రీ ♦ మద్రామ॥ ౧౨౬

మ॥ నయతన్ భూమిక లేఁడు నాబరగున్ పెన్ ♦ సాలంబులన్ గూల్చి యా
భయమన్ వాలినిఁ ద్రుంచి నిర్భయమునా ♦ భాసిల్లు సుగ్రీవునిన్
దయతోఁ నేలి, విదేహపుత్రి వెదకన్ ♦ దత్పావనిన్ బంపి త
మ్మయి సద్వాసనలన్ కపుల్ గొలువ శ్రీ ♦ మద్రామ॥ ౧౨౭

మ॥ తత వీర్యోజ్జ్వలుఁడై వెలింగెడు నిది ♦ ధ్యాసాంకుఁడా యాజనా
సుతుఁడున్ మోహము నాఁజెలంగు జలధిన్ ♦ జొప్పారఁగా దాటి యా
యతలో భ్రాంకితమైన లంకిణిసి శౌ ♦ ర్యంబొప్పఁ సిగ్గించి స
మ్మతి దుఃఖింబను లంకఁ జొచ్చెఁ నటు శ్రీ ♦ మద్రామ॥ ౧౨౮

మ॥ పలుదుర్వాసనలన్న దైత్య వరులన్ ♦ భర్జించి యానందమన్
ళలనన్ సీతనుఁ గాంచి మారుతియు వే ♦ డ్కన్ మించి సంకల్ప ని

స్తులితాశోకవనంబు దుల్చి ఘనతన్ ♦ దూటాడె సందేహమన్
మలినుండై తగు జంబుమాలి, భళి శ్రీ ♦ మద్రామ॥ ౧౨౯

మ॥ కుపితాజ్ఞాన సమాఖ్యుఁ నక్షయు దురు ♦ క్తున్ శిక్షఁగావించి, బల్
విపరీతంబను నింద్రజిద్ద్విజ వి ♦ ద్వేషిన్ గలంగించి, భ్రాం
తిపాశంబులఁ ద్రెంచి, పంక్తిముఖునిన్ ♦ ధిక్కారమున్ జేసిఁ. నే
మపుఁ దేజశ్శిఖి వెల్గె వాయుజుఁడు శ్రీ ♦ మద్రామ॥ ౧౩౦

శా॥ మానత్వంబను నగ్నిఁ గీలలొగిఁ గ్రమ్మన్ దుఃఖమన్ లంకనున్
దానన్ దగ మొనర్చి, నీకడకుఁ నం ♦ తన్ వచ్చి యచ్చోటి వా
ర్తా నీకంబులు విన్నవింపఁ నతఁడా ♦ త్మారామ! తత్సీతకై
మానొందందగు దాడివెల్వడితి, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౧

మ॥ జలధిన్ భంగమొనర్చి, నిశ్చల సమ ♦ జ్ఞాసేతువున్ గట్టి, ధ
ర్మ లలాముండగు తద్విభీషణునకున్ ♦ రక్షన్ బ్రసాదించి దో
ర్గర్వ కేళీగతిఁ నింద్రజిత్తుఁ నలయిం ♦ పంజేసి, బద్ధుండవై
మలగన్ సంశయ నాగపాశమున శ్రీ ♦ మద్రామ॥ ౧౩౨

మ॥ విడిపింపంబడి సద్విచారణమునన్ ♦ వెల్గొందు పక్షీంద్రుచేఁ
బుడమిన్ దామస కుంభకర్ణుఁ నసి లోఁ ♦ బోకార్చి, భ్రాంత్యస్త్రసం
జనుఁడౌ లక్ష్మణు మూర్ఛఁ దేర్చి, ఘన సి ♦ ద్ధానామ సంజీవిచే
మడియన్ జేసితి వింద్రజిత్తుఁ నట శ్రీ ♦ మద్రామ॥ ౧౩౩

మ॥ శితమా సాధన మోహనాస్త్రమున ని ♦ శ్శేషంబుగాఁ ద్రుంచి సం
చితమన్ మూలబలంబుఁ నంత గడఁకన్ ♦ శిక్షించి దుర్వాసనా
దితిజుల్ డిందఁగఁ నాదరించితివి, ప్రీ ♦ తిన్ గూర్చి సద్వాసనా
మతులౌ వానర సంచయంబులను, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౪

మ॥ తతగాంభీర్యమునా ధనస్సుఁ గొని మా ♦ ద్యల్లీల, లంకాపురీ
పతిపై దార్కొని, సింహగర్జనమునన్ ♦ బ్రజ్ఞాన దివ్యాస్త్రము
గ్రీత సంధించి నిగుడ్చి వైచితి, వహం ♦ కారామృతామేయ దు
ర్మత కుంభంబుఁ గదిల్చి గుట్టు విడ, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౫

మ॥ దశకంఠున్ బరిమార్చినాడవు తదా ♦ తత్స్వాధ రూపంబు లా
దశసంఖ్యేంద్రియ వృత్తులన్ వరలు ♦ తద్గ్రాంశంబులం దెంచి, స
ద్దశ సీతా సతిఁ నేలినాడవుగదా; ♦ త్వత్పాద యుగ్మంబు న
మ్మ శమించున్ భవరోగజాతములు, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౬

శా॥ ఆనందంబను సీతఁగూడి, యపవ ♦ ర్గాయోధ్యకుఁ జేరి, గీ
ర్వాణుల్ మౌనులుఁ గీర్తిసేయ, ఘన జీ ♦ వత్యాగ పట్టాభిషే
కానంతాత్మ శుభంబులఁ వడసి బ్ర ♦ హ్మలోక రాజ్యంబు స
న్మానంబొగతిఁ నేలినాడ విల, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౭

శా॥ శ్రీరంజిల్ల, ననంతమంగళ గుణ ♦ శ్రేణిన్ విడంబించుచుఁ
"శ్రీరామశ్శరణం మమేతి" విధులన్ ♦ జెల్వొందు మంత్రంబుని
త్యారూఢిఁ జపియించు దాసులకుఁ ని ♦ ష్టార్థంబులన్ గూర్చివే
మారుఁ వారలఁ బ్రోతు వీవెపుడు, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౮

మ॥ అకలంకోజ్జ్వల వేదరాసికిని, ని ♦ త్యాధారమున్, రూపముఁ
బ్రకటాచార్యతఁ నాథ్యతన్, విహరణా ♦ క్రాంతతఁ, బ్రాణమున్
సకలంబుఁ గురిఁ గాఁగఁ దాల్చిన, భవ ♦ త్సత్య స్వరూపంబు మా
మక హృత్పంకజపీఠి నిల్పెదను, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౯

మ॥ అమితం బద్వయ మాధ్య మాదిజనకం ♦ బానందకందం బజం
బమలం బవ్యయ మబ్జగర్భమఘవా ♦ ద్యాదిత్య సంసేవ్య ము

త్తమ మానీంద్రవచో విగోచరము, స ♦ త్యజ్ఞాన తేజంబు, బ్ర
హ్మమ్ముఁ దత్త్వంబును, నీవు గావె హరి, శ్రీ ♦ మద్రామ॥ ౧౪౦

మ॥ భవదీయాకృతి, నిశ్చలాత్మఁ బరికిం ♦ పఁగల్గు నప్పూరుషుల్
భవతాపత్రయ బాధలన్ జొరరు, ప్రా ♦ పంచ భ్రమన్ జిక్కి, దు
ర్వ్యవహారోక్తుల, నేను, నాది, యనుచున్ ♦ వాపుచ్చ రెన్నండు జ
న్మ విముక్తిన్ భవదంఘ్రులన్ విడరు, శ్రీ ♦ మద్రామ॥ ౧౪౧

మ॥ విడువన్ నేరను, నీపదాబ్జముల సే ♦ వింపంగ శ్రీ రాఘవా!
నుడువన్ మానను నీదు నామసుధలన్ ♦ గ్రోలంగ సీతాపతీ!
తలఁపన్ బాయను, నీదుమూర్తి మదిలో ♦ ధ్యానింప, శ్యామాంగయి
మ్మడిఁ నేవీడను నీ ప్రసాద మిఁక శ్రీ ♦ మద్రామ॥ ౧౪౨

మ॥ తెలియన్ లేరు, భవన్మహామహిమ మే ♦ దేవేశులన్నన్, భళీ
భళి, వాచాలుఁడ, గర్వుఁడన్, జడుఁడ, దు ♦ ర్భ్రాంతుండ, నీచాత్ముఁడన్
గలి, జన్మించిన వాఁడనేఁ దెలిసి, సన్, ♦ వర్ణింతు నా; చంద్రుఁ జే
మలయం బట్టఁగఁ జూచు కుబ్జవలె శ్రీ ♦ మద్రామ॥ ౧౪౩

మ॥ అల సీతాసతితో, విహారమును సే ♦ యన్ నీవు, శృంగారమున్
బొలుపౌ శూలి ధనస్సు భంగపరుపన్ ♦ బొల్పొందు, వీరంబు, ద
జ్జలధిన్ బంధనసేయఁ నొప్పు కరుణన్ ♦ సత్సేతువున్ గట్టఁ బెన్
మలలన్ వేయఁ జెలంగుఁ నద్భుతము, శ్రీ ♦ మద్రామ॥ ౧౪౪

మ॥ వలఁనా శూర్పణఖన్ గడున్ వికృత రూ ♦ పన్ జేయ, హాస్యంబు, దో
ర్బలతన్ రక్కసులన్ వధింప, భయ, భీ ♦ భత్సంబులున్, రావణున్
గలనన్ మర్దనసేయ, రౌద్రము, మునీం ♦ ద్రశ్రేణి పట్లన్ సదా
మలఁగన్ శాంతముఁ ద్వదప్రసాద్భుతులు, శ్రీ ♦ మద్రామ॥ ౧౫౪

మ॥ పస, రామాయణముల్, వశిష్ఠముఖరుల్ ♦ వాల్మీకి గాధేయులున్
రస భావంబులు తొమ్మిదింట గురివై ♦ ప్రామాణికప్రజ్ఞఁ సి
మ్మొ సఁగన్ లోకముఁ నుద్ధరించితసి, ధీ ♦ రోదాత్త సాద్గుణ్యముల్
మసరెన్ నీకథఁ నంచు, వ్రాసిరిల శ్రీ ♦ మద్రామ॥ ౧౪౬

మ॥ వెలయంగాఁ నిపుడేటి నాగరికు లే, ♦ విస్తారమో గాని వా
రల సత్వంబున సత్య దూరులయి, ప ♦ ర్యాయంబునన్ గ్రంథముల్
దిలకింపన్ మదిఁ నోడి, యర్థముల పే ♦ ర్మిన్ వీడి, దుర్వాదులై
మలుపన్ జూతురు, వేదధర్మముల, శ్రీ ♦ మద్రామ॥ ౧౪౭

మ॥ కలి ధర్మంబొఁ మఱే నికృష్టమగు పోఁ ♦ గాలంబొ, నేడేమొ, స
త్కుల శీలాఢ్యుల, జ్ఞాన నిష్ఠుల, భవ ♦ ద్గోప్యాంఘ్రి సేవా నిష
క్తుల,ఁ నేకాంతులఁ గాంచు మాత్రమున నేఁ ♦ గ్రోవ్వారఁ నీర్ష్యాగుణా
త్ములఁ నొక్కమ్మడిఁ జోటొసంగరిల శ్రీ ♦ మద్రామ॥ ౧౪౮

మ॥ తెలియన్ నిన్నెదఁ జింతసేయు బుధు లే ♦ ద్వేషంబుఁ జూపింత్రు, త్వ
ద్విల సన్నాఃసము, జిహ్వఁ బేర్కొనెడు నా ♦ విద్వాంసు లేవేదనల్
గలుగన్ జేతురు, నీపదార్చనలఁగా ♦ లక్షేపముల్ సల్పు ని
ర్మలులే కీడులొనర్తు రన్యులకు శ్రీ ♦ మద్రామ॥ ౧౪౯

మ॥ నుదుటన్ దీర్చిన పుండ్రముల్ భుజములం ♦ దున్ గొన్న మేల్ జందెముల్
బొదలన్ గంఠములందు వేయు తులసీ ♦ రుద్రాక్ష ♦ మాలల్ మెయిన్
గుదురన్ దాల్చిన పింజెదోవతులు, నె ♦ గ్గుల్ సేసెనే; వాసి, దు
ర్మదులై నాస్తికు లీసడించెదరు శ్రీ ♦ మద్రామ॥ ౧౫౦

మ॥ కొలలలో, సిగ్గులొ, తమ్ముఁ జుట్టుఁ నెడఁ ద్వ ♦ ద్గోవింద నామంబుఁని
మ్ములఁ గీర్తింతురు, తన్నివృత్తి కొఱకై ♦ పుణ్యాత్ములా వారు, హా

రలఁ గన్గొన్నఁ నదేమి చిత్రమొ కుత ♦ ర్కాంబొప్పఁ నెగ్గింతు దు
ర్మలినుల్ వారికి శిక్షయేమి హరి! శ్రీ ♦ మద్రామ॥ ౧౧౧

శా॥ "శ్రీ రామా యని యన్న మాత్రఁ గలుష ♦ శ్రేణుల్ పటాపంచలై
పాఱున్, నిత్యసుఖంబు, గూరు"నని దె ♦ ల్పన్ వేదముల్, సంఘసం
స్కారుల్ గొందరు తత్వసంస్కరణఁ నా ♦ ఖ్యన్ జెప్పఁ దప్పించుదార్
మా రాటంబున కుత్సహింతు కలి శ్రీ ♦ మద్రామ॥ ౧౧౨

శా॥ శ్రీ రామాచ్యుత! కేశవా నరహరీ! ♦ శ్రీ ♦ నాథ! గోవింద! దై
త్యారీ! వామన! వాసుదేవ ముర సం ♦ హారా! ముకుందా! హరీ!
క్షీరాంభోనిధి శాయి! మోక్ష జయల ♦ క్ష్మీ సౌఖ్యసంధాయి! రా
మా! రాజీవదళాక్ష! చక్రధర! శ్రీ ♦ మద్రామ॥ ౧౧౩

మ॥ ధృతిఁ గంఠీరవ గర్జనోద్ధత గతిన్ ♦ దిక్పూరితంబైన నీ
శ్రుతి నామంబును నెవ్వఁడొక్క పఠిసం ♦ శుద్ధాత్ముఁడై పల్కునా
తత దుష్టగ్రహ వేదనా విగళితో ♦ ద్యద్గాత్రుఁడై వాఁడు దు
ర్మత తంత్రాద్భుత భేదియై పొలుచు శ్రీ ♦ మద్రామ॥ ౧౪౪

మ॥ కలిఁ నెంతెంతటి వైపరీత్యములుఁ గ ♦ ల్గన్ గల్గనీ; ధర్మక
ర్మల సన్మార్గములెల్లఁ గుంటువడి తా ♦ ర్మారైనఁ గానీ; మతే
పలువల్ పెంపుఁ జెలంగినన్ జెలఁగనీ; ♦ స్వామీ! నినున్ గొల్చుని
ర్మలు [illegible] మహిమోన్నతిన్ జెడరు, శ్రీ ♦ మద్రామ ౧౧౫

శా॥ స్వర్గంబో, యపవర్గమో, తెలియఁగా ♦ జాలన్ సుమీ, స్వామి! నీ
సర్గంబాదు, విలాసలీలఁ బోలుపై, ♦ సత్యేతరంబై ♦ కడున్
దుర్గాధ్వప్రతికారమై తగు వసూ ♦ స్తోమార్థ భోగంబె, స
న్మార్గంబంచు, భ్రమించుచుంటి, దమి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౬

శా॥ ఏరా! యింతటి ఘోరపాపుఁడవు, ని ♦ న్నేరీతి రక్షింతురా,
పోరా, యంచు వచింతువేమొ, యిదె, నే ♦ ముమ్మాటికిన్ నీపద
శ్రీరాజీవములంటఁ గట్టుకొని నా ♦ జీవంబు లర్పింతు సు
మ్మా, రామా! గుణధామ, నీకుఁనయి, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౭

శా॥ వీఁడా, నమ్మినవాఁడు, దుర్విషయ సం ♦ ప్రీతుండటంచున్ ననున్
వీడన్ జూచెద వేమొ, నిశ్చయముగా ♦ నీమాయలోఁ జిక్కి కే
ప్రోదండైనను గోడు మానెనె; గడున్ ♦ మూఢుండ, నీవాఁడఁ నీ
మైడంబున్ గొనియాడఁనేఁనెవఁడ, శ్రీ ♦ మద్రామ॥ ౧౧౮

మ॥ నసి, నీకే తగు, బైసి నాకె తగుఁ, నే ♦ సర్వాపరాధిన్, కృపా
రసపాథోనిధి వీవు, నే జడుఁడ, స ♦ త్ప్రజ్ఞుండ వీవెయ్యెడన్
బస, నిర్హేతుక జాయమాన కరుణా ♦ పాంగుండవై ప్రోచి నా
మసటుల్ దీర్పగదే, ప్రభుప్రవర! శ్రీ ♦ మద్రామ॥ ౧౧౯

శా॥ ఓరీ! ప్రహ్లద! యేల నీకు పొగరీ ♦ యుద్వృత్తిఁ జాలింపరా,
తారుణ్యోజ్జ్వలకాయ గర్వముఁన, మ ♦ ద్ధ్యానంబు లేకుంటి వి
ఱ్ఱేరా; చూడర; నీదుమేఁ నిపుడటం ♦ చీ స్ఫోటకవ్యాధి చే
మారామున్ దెలియంగ జేసితివె; శ్రీ ♦ మద్రామ॥ ౧౨౦

శా॥ ఔనయ్యా! యిఁకఁనేమి చేసెదవు, కా ♦ యంబన్న మార్పానదే;
వాణీ నాథునకైనఁ నైనఁనెద సిన్ ♦ భావించుటన్ మాన, దే
వా! నీపాదములాన, నీపనుపు స ♦ ల్పన్ బ్రహ్మరుద్రాదులే
మా నొందన్ శిరమొగ్గినారు గద, శ్రీ ♦ మద్రామ॥ ౧౨౧

మ॥ చెలు వొప్పారఁగ, దక్షిణాభి ముఖుఁడై ♦ శ్రీ గౌతమీ గంగ ని
స్తులతన్ బాఱఁగ, బాపదూరుఁడగు భ♦ద్రుండెవ్వనిన్ గొల్వఁ నీ
కలిదోషంబులఁ బాపి ముక్తినిడి, భ♦క్త శ్రేణి రక్షింపఁ గో
మల పాదాబ్జ యుగంబునన్ బొలుచు, శ్రీ ♦ మద్రామ॥ ౧౩౨

మ॥ పృథు భద్రాద్రి, సహస్రకోటి రవిదీ♦ప్తిన్ మించుచున్ శంఖ చ
క్ర ధనుర్బాణంబులు నాల్గుబాహులఁ జెలం♦గన్ సీతవామాంకమం
దు ధృతిన్ భాసిలఁ బశ్చిమాభి ముఖతన్ ♦గూర్చుండి సౌమిత్రితో
మధువైరీ! వెలుఁగొందఁ గంటి నిను శ్రీ ♦ మద్రామ॥ ౧౬౩

మ॥ కంటిన్ భద్రునిమూర్ధ్నమందుఁబొలుపై, ♦క్ష్మాపుత్రి, సౌమిత్రి, మేల్
బంటౌ పావని, నిత్యసూరులుఁ దలి♦ర్పన్; రామభద్రుండవై
యుంటన్ గంటిఁ నెదన్, మొయిన్ వ్యథలువోఁ♦నొడ్డన్, గనుంగొంటిఁ నే
మంటిన్ భద్రముఁ గొంటి, నీ కృపను, శ్రీ ♦ మద్రామ॥ ౧౬౪

మ॥ దనుజ ధ్వాంత దివాకరా! శుభకరా! ♦ దాక్షిణ్య రత్నాకరా!
ఘన మౌనీంద్రమనోవిహార! వికస ♦ త్కంజాత నేత్రా! ధరా
తనయా దివ్యకళత్ర! యర్థి జన మం ♦ దారా! రఘుస్వామి! శ్రీ
మను వంశార్ణవ చంద్ర! భద్రగిరి, శ్రీ ♦ మద్రామ॥ ౧౬౫

మ॥ రవణంబై తగుఁ గ్రొత్త నూళ్లవరగో ♦ త్ర ప్రస్ఫుర త్కోన వం
శ వరిష్ఠుండగు కోటి లింగయకు మేల్ సౌశీల్య ♦ సంపద్గుణో
త్సవయౌ శ్రీ భ్రమరాంబకున్ సుతుఁడ, నో♦జన్ రాఘవాఖ్యుండఁ నా
త్మ నిధిన్ దప్పులఁ నిందుఁగై కొనకు, శ్రీ ♦ మద్రామ॥ ౧౬౬

మ॥ ధరశాకాబ్దములద్రివేద గజచం ♦ ద్ర వ్రాతమా సంఖ్యలన్
వరలన్ గోత్రధన చైత్ర శుక్లనవమిన్ ♦ బాటిల్లు పర్వంబునన్
గురువారంబున ధాతు శాస్త్ర హరిణాం♦ కుల్ బొల్చు పద్యాళిసిన్
స్మరణన్ చేసి వచించితీకృతిస శ్రీ ♦ మద్రామ॥ ౧౬౭

ఓం తత్సత్ సీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

శ్లో॥ దోషోఽపి గుణతాంయాతి । పణ్డితా నామనుగ్రహాత్
అయస్సువర్ణతామేతి । సంస్పర్శాత్ స్పర్శవేదినః॥

సంపూర్ణము.



# —౹ తప్పొప్పుల పట్టిక.౹—



| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 11 | మ! | మ. |
| 4 | 1 | శ్రీమద్రామమ, | శ్రీమద్రామ |
| 5 | 11 | మఁలగుర్ | మలఁగున్ |
| 5 | 19 | డీఁతడంచు | డితఁడంచు |
| 6 | 19 | మున్గజూచి | మున్గన్ జూచి |
| 7 | 7 | నిక | నిఁక |
| | 11 | తాంఘ్రి | తాంఘ్రి |
| | 12 | మదోజ్ఞ | మనోజ్ఞ |
| 8 | 1 | శ్రీమద్రామమ | శ్రీమద్రామ |
| 1 | 6 | భనదీయ | భవదీయ |
| | 9 | చారంబుస్ | చారంబుర్. |
| | 9 | శ్రీమద్రామచంద | శ్రీమద్రామచంద్ర |
| | 17 | 3౨ | 3౯ |
| 11 | 11 | మనఁబు | మనంబు |
| 13 | 8 | గదెర్గోసి | దెగర్గోసి |
| 14 | 7 | పరబ్రింహ్మా | పరంబ్రహ్మా |
| | 17 | విడఁనాదు | విడఁనాడు |
| | 23 | ను. ధ్యానాళి | నుధ్యానాళి |
| 16 | 15 | వాపోనసేలా | తావాపోవఁసేలా |

| | | | |
|---|---|---|---|
| 17 | 15 | హరిణాంకాగ్చి | హరిణాంకాగ్ని |
| 17 | 15 | యద్వైంతంబు | యద్వైతంబు |
| 18 | 22 | గాంచం | గాంచు |
| 19 | 16 | యూహింపఁ | యూహింపఁ |
| | 20 | సహస్రాఖ్యలన్ | సహస్రాఖ్యలన్ |
| 20 | 2 | వర్ణమున్ | వర్ణముఁ |
| | 4 | భకుల్ | భక్తుల్ |
| | 15 | ట్లయినన్ | ట్లైనన్ |
| | 21 | మ్మొ | మైత్రి |
| 23 | 8 | సరగఁ | సరగఁ |
| 24 | 11 | భాదాత్త | భావాత్త |
| | 14 | బరగుఁ | బరగు |
| 25 | 9 | దగమొనర్చి | దగ్ధమొనర్చి |
| 27 | 10 | శ్యామాంగ | శ్యామాంగ! |
| 28 | 14 | జూపితురి | జూపితురి? |
| | 16 | జేతురు | జేతుగు? |
| | 17 | రన్యులకు | రన్యులకు? |
| 29 | 3 | శిక్షయేమి | శిక్షయేమి; |
| | 23 | చుంటిదమి, | చుంటేదమి |
| 31 | 18 | ప్రస్పుర | పరిస్ఫుర |
| 32 | 5 | చేసి | జేసి |
| | 6 | మసు | మస్తు |